Telugu Classics - Popular Edition Series

శ్రీమత్

# ఆంధ్రమహాభారతము

## ఆదిపర్వము

(నన్నయ కవి ప్రణీతము)

పరిష్కర్త
కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
కళాభవనం _ హైదరాబాదు-4

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈలోటును తీర్చి ప్రాచీనగ్రంథ సంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమీ ఒక ప్రణాళిక సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతి గ్రంథములో గ్రంథకర్తనుగూర్చి, గ్రంథ ప్రాశస్త్యమునుగూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్తగ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్రమహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే భారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్ర మహాభారత సంపుటములలో మొదటిదైన ఆదిపర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన కవిసమ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణ శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమీ పక్షాన కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
25-9-1970

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పద్యవిద్య

తరలము,

హరిహరాజగజాననార్క-షడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధికున్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభున్ బ్రచేతసుపుత్త్రి భక్తిఁ దలంచుచున్.

నన్నయ్యగారు తనభారతముమొదట నిద్దరుకవులనే స్తుతించినారు. మొదటికవి వాల్మీకి, రెండవకవి వ్యాసుఁడు. మూడవకవి నెన్నుకొనలేదు.

ఈ వాల్మీకి స్తోత్రము చిత్రముగా నున్నది. ఆయనకు మూడువిశేషణములు వేసెను. (1) దుర్భరతపోవిభవాధికుఁడు. (2) అంబురుహగర్భనిభుఁడు. (3) గురుపద్యవిద్యకు నాద్యుఁడు. ఆయన ప్రచేతసుని కుమారుఁడు గనుక ప్రచేతసుపుత్రుఁ డనెను.

కవులనుఁ జెప్పుటలో కల్పనాచతురుఁ డని, శిల్పాభిరాముఁ డని బహుగుణసముద్రుఁ డని, యేమోయేమో యెన్ని చెప్పరాదు. అందులో వాల్మీకిని గురించి చెప్పరాని గుణము లుండునా? సర్వకవితాజగత్తు వాల్మీకినుండి కదా సముద్భవించినది. అట్టి వాల్మీకిని గురించి కవిగా నన్నయ్యగారు చెప్పిన దొక్కటే మాట. "గురు పద్యవిద్యకు నాద్యుఁ"డని- వాల్మీకికి పూర్వము సంస్కృతములో కవిత్వము లేదని ప్రతీతి. అచ్చట మన పరిశోధనలు పనికిరావు. దాని వెనుక బోలెడంత కథ యున్నది.

హఠాత్తుగా వాల్మీకి నోటివెంట ఛందోమయ మైన పద్యము వచ్చినది. బ్రహ్మ సాక్షాత్కరించినాఁడు. రామాయణమును వ్రాయుమన్నాఁడు. అట్టి కథ నన్నయ్యగారి వెనుక లేదు. శాసనము లున్నవి. శాసనములలోని పద్యము లున్నవి. పై పెచ్చు నన్నెచోడుఁడుకూడ నన్నయ్యగారికి పూర్వుఁ డన్న వాదన యున్నది, మరియు కథ లున్నవి; అధర్వణుఁడు భారతము వ్రాసెనని, దానిని

నన్నయ్య యీర్ష్యతో నాశనము చేయించెనని. వాల్మీకి యదృష్టవంతుఁడు గనుక నొకటి, యాయన యాంధ్రదేశములో పుట్టలేదు. రెండు, తత్పూర్వ మింగ్లీషువాఁడు రాజ్యము చేయలేదు. ఎవని యుపజ్ఞచేత మన మనస్సులు మారి పోయి సంప్రదాయమునందు విశ్వాసము పోగొట్టుకొని పరిశోధనబుద్ధితో యథే చ్ఛావాదములు చేయుచున్నామో ఆ యింగ్లీషువాఁడు.

నన్నయ్య వాల్మీకికి కవితావిషయికమైన విశేషణ మొక్కదానినే వేసెను. అది– "గురుపద్య విద్యకు నాద్యుఁడు"—అన్నది. ఈ విశేషణము తనకుఁ గూడ చెందవలయు నని నన్నయ్యగారి యూహ కావచ్చును. కావచ్చు ననుటకు చాల సావకాశ మున్నది. ఇప్పటి యాధునికులు పరిశోధకులు. శాసనములలోని పద్యములు చూపించి మరి యితరకారణములు చూపించి నన్నయ్యగారు తెలుగులో పద్యరచనకాద్యుఁడు కాఁడు అని నిరూపింపవచ్చును. ప్రయత్నము చేయవచ్చును. ఆ లెక్కన చూచినచో వాల్మీకిమహర్షియు సంస్కృతములో పద్య రచన కాద్యుఁడు కాకపోవచ్చును. అనుష్టుప్పు ఛందస్సు. అది వేదమునందంతయు నిండియున్నది. మరి వాల్మీకి తక్కిన వృత్తములు వ్రాసినాడేమో! అనుష్టుప్పును నిర్మించలేదుకదా! కనుక సంస్కృతమునందు వాల్మీకి ఛందోనిర్మాత కాడు. ప్రథమపద్యనిర్మాత కాడు.

మరియు నిచట పద్యవిద్య యని యున్నది గాని పద్యరచన యని లేదు. పద్యరచన వేఱు, పద్యవిద్య వేఱు.

విద్య యనగా జ్ఞానము. అనేకవిద్య లున్నవి. చతుర్విద్యలు, చతుర్దశ విద్యలు, అష్టాదశవిద్యలు— విద్య యన్న శబ్దము క్రింద నిఘంటుకారుఁ డైన ఆప్తే (Apte) కొంత వ్రాసెను. శ్రీ బరూరి సీతారామాచార్యులవారు దానిని యథాతథముగా తన శబ్దరత్నాకరమునం దెక్కించుకొన్నట్లున్నది. తరువాత నిడదవోలువారు కూడ దానిని మార్చలేదు. అష్టాదశవిద్య లనగా నేవి యేవియో చెప్పబడలేదు. నేను వెనుక నెప్పుడో యెక్కడో చదివితిని. ఇప్పు డాగ్రంథములు లభ్యమానము లగుట లేదు, ఆ విద్యలో కవిత్వ మొకటి.

కవిత్వము విద్యలలోని కెందుకు వచ్చును, గణయతిప్రాసలు కూర్చినంత మాత్రమున కవిత్వము కాదుకదా! గణయతిప్రాసలు లేకుండగనే కవిత్వ మగు

చున్నప్పుడు గణయతిప్రాస లున్నచో నెందుకు గాదు అన్న ప్రశ్న యుదయింప వచ్చును, పోనిండు,

విద్య యనగా నేమి ? మనము మన యూహతో పరిశీలింతము. లోకము నందు వాడు విద్యావంతుడు అని యనుట కలదు. అన్నప్పటి మానవుల యుద్దేశ్యమేమి ? నేర్పుకలవాడని, వివేకముకలవాడని, ఒకానొకశక్తి కల వాడని, ఆ శక్తి సర్వసామాన్యమైనది కాదని, అది భగవద్దత్తమని. ఇట్టి భావ ముల నుక్తములుగా నామాటయనెడి వారి భావనిష్ఠములై యుండుచున్నవి. కనుక విద్య యనగా నొక నేర్పు, ఒక భగవత్ప్రసాదితమైన శక్తి, ఒక వివేకము. నేరు పనగా నితరుల కలభ్యమైన విషయములను సంయోగపరచుటలో వివేకము భాసించునట్లు చేసెడి క్రియాదీప్తి.

చౌర్యముకూడ విద్య. దానినికూడ విద్యగా లెక్కపెట్టిన మన పూర్వులు మన తెలుగుప్రజలు రేచుక్క పగటిచుక్క కథలను వ్రాసిరి, విద్య యని నంతనే యది యొకవిలక్షణమైన వివేకముతో కూడిన కార్యము,

కవిత్వము విద్య. వట్టి గణయతిప్రాసముల కూర్పు కాదు, దాని వెనుక నింకేదియో యున్నది. దానిని తరువాతివారు శిల్ప మన్నారు, ఇంకను దానిలో నున్న యనేక గుణములను దీసికొని యాలంకారికులు పెద్దపెద్ద గ్రంథములను వ్రాసినారు. రీతి, వృత్తి, శైలి, పాకము, రసము, ధ్వని, యలంకారములు, గుణములు, దోషములు— ఈ కవిత్వమును గురించి పెద్ద రగడ పెరిగినది, ఇది యంతయు విద్య, పద్యవిద్య యన్న మాటయొక్క యర్థము కాలముమీద పెరిగిపోయినది. ఆధునికుల లెక్క ప్రకారము నన్నయ్యగారు వేయియేండ్ల క్రిందటివాడు. సంస్కృతములోని యాలంకారికుల కాలముకూడ మిక్కిలి కట్టి నచో నన్నయ్యగారి కాలముకంటె రెండు మూడేండ్ల పూర్వము కావచ్చును. సంస్కృతములో నెక్కువ యలంకారగ్రంథములు కాశ్మీరదేశమునందు పుట్టి నవి. పుట్టిన వెంటనే సర్వ భారతదేశమునందు పర్యటించిన వని చెప్పుటకు వీలు లేదు, ఆనందవర్ధనుడు ధ్వని సూత్రములను వ్రాసెను. దానిమీద నభినవగుప్త పాదుని లోచనవ్యాఖ్య పుట్టుటకు రెండువందల యేండ్లైన పట్టి యుండవచ్చును, ఎందుకనగా నభినవగుప్తుడు ధ్వని సూత్రములు తమ యింటి పరంపరగా వచ్చు చున్న వని తాము చదువుచుంటి మని తా నప్పటికి వ్యాఖ్య వ్రాసితి నని చెప్పి కొన్నాడు కనుక.

పరిస్థితు లిట్లున్నవి కనుక నన్నయ్యగారు పద్యవిద్య యన్నప్పుడు సర్వాలంకారగ్రంథములు తెలిసికొనియే యిట్లు వ్రాసె ననుటకు వీలుండదు, ఆయన పద్యములను విద్యగా చూచినాడు.

"పరమవివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజో, త్కర రుచిరమ్ములై సకలగమ్యసుతీర్థములై మహామనో, హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైన సత్సభాం, తర సరసీవనంబుల ముదం బలరన్ గొనియాడి వేడుకన్——"

ఈ పద్యము ప్రమాణముగా నానాడు తెలుగు దేశములో కావ్యగుణ నిర్ణయముచేయు పరిషత్తు లుండెడి వని తెలియుచున్నది, అలంకార గ్రంథములు వానినిబట్టి కావ్యగుణము నిర్ణయించుట మొదలైన లక్షణములు నాటి కాంధ్ర దేశమున లేదనుట కీ పద్యమువలన నూహించవచ్చునేమో!

మరియు నన్నయ్యగారు తాను వ్రాసిన రెండున్నర పర్వములలో తాను విభాగించిన ప్రతి యాశ్వాసాంతమునందును తన కావ్యము రమణీయముగా నున్నదని చెప్పుచు వచ్చెను, ఈ రమణీయశబ్ద మెచ్చటినుండి వచ్చినది? ఆంధ్రదేశస్థ కావ్యపారిషదులనుండి వచ్చి యుండవచ్చును, వారు కావ్యమును విని రమణీయముగా నున్నదని యనుచుండెడివారు కాబోలును. కావ్యమునందలి మేలిమి రమణీయశబ్దవాచ్య మనుట ఆంధ్ర సాహిత్యవేత్తృపరిషత్తులయొక్క అభిప్రాయ మనుటకు వేఱొక సాక్ష్యమున్నది. ఆ సాక్ష్యము జగన్నాథ పండితులవారి సాక్ష్యము. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని ఆయన సూత్రించినారు. ఈ మాట పూర్వము నేనొక సభలో చెప్పగా నొకపెద్దతర్కపండితులు కొంచెము కోపగించికొన్నారు, ఎందుకనగా జగన్నాథపండితుఁడు నన్నయ్యగారి తరువాతివాఁడు, నేనేమో జగన్నాథ పండితుని తక్కువ జేయుచున్నానని.

ఒక్కటి మాత్రము మనము నమ్మవచ్చును. పూర్వాంధ్ర సాహిత్య పరిషత్తులు కావ్యము రమణీయముగా నున్న దనుట వారి ప్రశంసామార్గ మని.

ఇప్పుడు కావ్యము పద్యవిద్య నాశ్రయించి యున్నదన్న విషయము నిశ్చయించవచ్చును. విద్య యనగా దానిని వెలయించిన వాని యొక యఖండ మైన ప్రతిభ ననుసరించి యుండునది యనియు నట్టి ప్రతిభాద్యోతకమైనదియే విద్య యనియు. అది విద్య యనిపించు కొనుటకు విద్య యగుటకు నా విద్య వెనుక

నొక నేర్పు వివేకము భగవద్దత్త మైన ప్రతిభయు నుండవలయుననియు నిశ్చ యముగా చెప్పవచ్చును.

అయినచో నిట్టి పద్యవిద్యకు నన్నయ్యగారి ప్రకారము సంస్కృతములో వాల్మీకి యాద్యుడు సర్వాలంకార శాస్త్రములును వాల్మీకి రచన నుండియే పుట్టినవి కదా! అట్లే నన్నయ్యగారు తెలుఁగులో తాను పద్యవిద్య కాద్యుఁడ నని యను కొన్నట్లు తోచుచున్నది. సంస్కృతములో వాల్మీకికంటె పూర్వమే వేదము నం దనుష్టుప్పున్నట్లుగా నొక్క యనుష్టుప్పే కాదు గాయత్రి మొదలైన ఛందస్సు లున్నట్లుగా తెలుగులో గూడ నన్నయ్యగారికంటె పూర్వమే పద్యరచన యున్నది. కాని యీ పద్యవిద్యను ఆంధ్రభాషలో సృష్టించినవాడు నన్నయ్యగా రని చెప్ప వలయును.

కాని నన్నయ్యగారు భారతమును తెలుగు చేసినవాడు. వాల్మీకి కథను కల్పించినవాడు, అన్నచో నదియు నిజము కాదేమో! మన సంప్రదాయము ప్రకారము వాల్మీకి రామకథను కల్పించలేదు. భవిష్యత్తులో నది యట్లు జరుగుట నిర్ణీత మై యున్నదని తాను మహర్షి గనుక తపోదృష్టితో చూచి చూచి నది వ్రాసెను. చూచినది వ్రాయుటలో కల్పన యేమి యున్నది?

నన్నయ్యగారు కూడ తాను వ్యాసుని భారతమును యథాతథముగా తెలుగు చేయలేదు. అనేకములు వదలి పెట్టెను, కొన్నిటిని గ్రహించెను. కొన్నిటిని కల్పించెను. కొన్నిటి నితర పురాణములనుండి సంగ్రహించెను. ఇది వేఱే విష యము. మహా విషయము. ఆధునికుల దృష్టి కందుచున్నట్లు లేదు.

ఇది పద్యవిద్య, ఈ విద్య బహువిధములు. ఇందులో ప్రధానమైనది పద్యము. విద్య యనగా విద్య యెంత మేరయుండునో యున్నంతమేర ప్రతిభ యనుస్యూతమై యుండును. ఈ విద్యకు మొట్టమొదటిది పద్యము. నన్నయ్య గారు తెలుగులో పద్యము వ్రాయుట యెట్లో యెట్లు వ్రాసినచో నది పద్యమగునో చేసి చూపించినవాడు. ఆయన యాంధ్రభాషలో అంబురుహగర్భనిభుండు, అనగా బ్రహ్మతో సమానమైనవాడు, బ్రహ్మ సృష్టి చేయును. సృష్టి యనగా జీవులు, వారి యాయుర్దాయములు, వారి రూపు రేఖలు వారి కర్మలు— ఒక్కటి యేమి సర్వమును నతని సృష్టియే. అంతయు కల్పించినను వెనుక నొకటి యున్నది. ఒక జీవు డున్నాడు. వాని జీవసంపుటి యున్నది. దాని ననుసరించి

దాని చుట్టును నిర్మించిన యీ శరీరము. ఆ జీవసంపుటిలోని కర్మయొక్క సూక్ష్మములైన లేశలేశములు — ఒకటి యాయుస్సుగా, ఒకటి యాకారముగా. ఒకటి వాని యదృష్టముగా, భిన్నభిన్నములుగా సృష్టించుచున్నాడు. నన్నయ్య గారు చేసినది కూడ నిట్టిదే.

ఉదంకుడు పౌష్యుని శపించినాడు. పౌష్యుఁడు మరల శపించినాడు. శాపమును మరలించుటకు పౌష్యుడు తాను సమర్థుడను కాదన్నాడు. ఇది యందరకును వచ్చిన పద్యమే.

నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రు డోపు నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్.

దీని మూల మిది.

నవనీతం హృదయం బ్రాహ్మణస్య
వాచి క్షురోనిహిత స్తీక్ష్ణధారః
తదుభయ మేత ద్విపరీతం క్షత్రియస్య
వాఙ్నవనీతం హృదయం తీక్ష్ణధార మితి.

ఈ పద్యమున కుత్పలమాల వ్రాయవలయు నని యె ట్లూహ కలిగినది, మూలములో లేని నిండుమనమ్ము నెచ్చటినుండి తెచ్చినాడు. మూలములో బ్రాహ్మణశబ్ద ముండగా తాను విప్రశబ్ద మెందుకు వాడినాడు? మూలమునందు హృదయ మన్న శబ్దమున్నది. తాను వాడిన శబ్దము మనమ్ము. హృదయము నకు తెలుగు. 'నిండుమనము' అన్న మాటయా? ఇది విచారించదగినది. మనస్సు సంకల్ప వికల్పాత్మకమైనది, హృదయమునుండి పుట్టుచున్నది. మనస్సుయొక్క పరమార్థము హృదయము. ఇది వేదాంతములలో చెప్పబడిన విషయము.

వాక్కునందు బ్రాహ్మణునకు తీక్ష్ణధారమైన క్షురము — కత్తి యున్నది. ఇది మూలము. తెలుగు సేత యెట్టిది. పల్కు దారుణాఖండలవజ్రతుల్యము. శస్త్రతుల్య మని కూడ పాఠ మున్నది. మూలమునందు హృదయము ప్రథమా

విభక్తియందు జెప్పబడినది. వాక్కు సప్తమియందు చెప్పబడినది. తెలుగు సేతలో రెండును ప్రథమావిభక్తిలోననే యున్నవి. ఆఖండలశస్త్రతుల్యము. ఇంద్రునియొక్క యాయుధము వజ్రమనుకొందము. ఈ వజ్రాయుధము దధీచి వెన్నెముక. ఒక మొద్దు కట్టెవంటిది. వెనుకనున్న నవనీతము మెత్తనివానిలో మెత్తనిది. అందులో నవ్య యన్న శబ్దము నన్నయ్యగారు కలిపినారు. నిన్న మొన్నటి వెన్న కొంత బిగియును. అందులోని మజ్జిగ సంపూర్ణముగా నోడి పోవును. వెన్న యెంత మెత్తనిదో బొమికి యంత గట్టిది. కుక్కలకు గూడ కొఱుకరానిది.

ఆ రెండును క్షత్రియునకు విపరీతమని మూలములో నున్నది. తెలుగులో క్షత్రియ శబ్దము లేదు. 'రాజులందు' అని యింకొక శబ్దము ప్రయోగించినాడు. మూలములోని నాల్గవచరణము వాక్కు నవనీతము హృదయము తీక్ష్ణధార మని విపరీతముగా మరల చెప్పబడినది. నన్నయ్యగారు విపరీతమన్నాడు. అర్థమై పోయినది. మరల చెప్పుటెందులకు ? అవి తలక్రిందులు చేసి చెప్పవలయునా ? కావ్యశోభ తగ్గిపోదా ? చెప్పలేదు.

చెప్పక యిందొక యర్థమును జెప్పినాడు. శాపమును గ్రమ్మరింపగా విప్రు డోపును. నరపాలు డోపడు.

క్షత్రియశబ్దమును దీసిపారవేసి యచ్చట రాజశబ్దమును ఇచ్చట నరపాల శబ్దమును వాడినాడు. ఈ రెండు నేకార్థకములా ? "వారు రాజులు" కులవాచకముగా వాడుట కలదు. కాని ప్రధానముగా నేల నేలువానినే రాజని యందురు. నరపాలు డని వాడినాడు. ఇచ్చట విపరీతము.

నరపాలు డనగా నరులను పాలించువాడు. అధికారము కలవాడు. న్యాయాన్యాయములు పరిశీలించువాడు. రాజనీతిని పాలించువాడు. అతడు నిజము చెప్పడు. దాచియే చెప్పును. పైకి చాల శాంతముగా నుండును. లోపల గోతులు తీయుచుండును. ఎవడో ఏదో పనిమీద వచ్చును. వానిపని తాను చేయడు. చేసెడి సంకల్పము లేదు. వానిమీద నీ యధికారికి కోపమున్నది. పై కాసంగతి చెప్పడు. నీ కాపని తప్పక చేసి పెట్టుదునని చెప్పును. ఇందుచేత నరపాల శబ్దము వాడబడినది. రాజులు అన్న శబ్ద మిందుకనియే వాడబడినది.

మూలములోని క్షత్రియ శబ్దమున కీశక్తి లేదు. వ్యుత్పత్తిచేత నసలు లేదు.

విప్ర శబ్ద మున్నది. వేదపాఠంతు విప్రాణాం అని యందురు. విప్రు డెప్పుడును వేదమును పఠించుచుండును. వేదము కఠినమైనది. వాని వాక్కు కఠినముగా నుండును.

ఈ పద్యమును 'నిండుమనంబు' అన్న శబ్దముతో మొదలు పెట్టుటయే బ్రహ్మసృష్టి కారంభము. చివరకు 'ఓపం డతిశాంతు డయ్యు' అని ప్రాస స్థానమునందు 'ఉ'కారమునకు సంధి నిత్యముతో పద్యము నడపుట విద్యలో నొక భాగము.

పద్యము రచించుటలో నందులో తెలుగు పద్యము రచించుటలో ప్రాస స్థానములు యతిస్థానము లదుకుటలో వందలాది యందము లుత్పన్నములగు చుండును. అట్టివాని కనేకములకు నన్నయ్యగారు బీజములు వేసి పోయినాడు. బ్రహ్మసృష్టి యనగా నిది.

పద్యరచనలోని మెలకువ విద్య. శబ్దమును సప్రయోజకముగా వాడుట విద్య. ధారాశుద్ధిగా నోటికి వచ్చినట్లు వ్రాసికొని పోవుట విద్యకాదు. అది వట్టి పద్యరచన కావచ్చును.

మరియును ఈ పద్యమునం దనుస్వార పూర్వక దకారము ప్రాస చేయబడినది. ఆ ప్రాసవలన నాల్గు చరణములయం దిది యుండుటవలన నుచ్చరించునపుడు ఒక విలక్షణమైన సవ్వడి వచ్చును. ఆ సవ్వడియం దొక గుణముండును. ఆ గుణము ననుసరించి తక్కిన పద్యము నంతయు జేయుట మాధుర్యమో సౌకుమార్యమో ఓజస్సో ప్రౌఢియో మరి యేగుణమో! ఎట్లుద్భవిల్లును? ఆ గుణము పుట్టెడి అనేకాక్షర సంయోజనములను కవి అనుస్యూతిగా పద్యము నందంతయు నింపించి యల్లినచో నా పద్యమునం దాగుణ ముద్భవిల్లును. దానికి కవి బ్రహ్మ కావలయును. ప్రతిభావంతుడు కావలెను. ప్రత్యక్షరజనిత మైన అక్షరసంయోజన జనితమైన యొకశక్తియందు కవియొక్క జీవుడు మేల్కొని యుండవలయును.

ఇది రెండు రకములు. ఇట్టి ప్రతిభావంతులు ఇట్టి దేవదత్త శక్తి కల వారు; పలుమంది కవులు పూర్వ ముదయించగా వారి కావ్యములు చదివి యా

గుణములు పరిచితములై తరువాతి తరువాతి కవులు తమ జీవలక్షణమునకు సన్నిహితముగా నున్న యొక గుణమును తమ కావ్యములందు వెలయించికొన వచ్చును. దానికి గూడ కొంత దేవతాప్రసన్నత యుండవలయును. కొంత పూర్వజన్మసంస్కార ముండవలయును. ఇది రెండవది.

మొదటి దేమనగా నన్నయ్యవంటి ప్రథమకవి అక్షరములను శబ్దములను వాని శక్తులను తాను సహజముగా భావించియో పరమేశ్వర ప్రేరితమైన వాక్కు కలిగియో యొక మహారచన చేయుట దానియందొక విస్పష్టమైన కవితాగుణము బ్రహ్మాండముగ భాసించి యొడ్డు లొరసికొని ప్రవహించుట.

గురుపద్యవిద్య కాద్యత్వ లక్షణములలో నిది యొకటి.

నన్నయ్యగారి యొక బ్రహ్మాండమైన శక్తి యాంధ్రపద్యరచనానిర్మాణమున విచిత్రముగా నుండును. పాఠకుడుగాని భావుకుడుగాని సమృద్ధిగా కన్పించుచున్న వస్తుసామగ్రియందు తన యనుభవమును దాను జూచుకొనునుగాని దాని మూలతత్త్వమును జూడడు. దాని ప్రథమసృష్టిరహస్యమును జూడడు, ఇది చాల విచిత్రమైన వ్యవహారము, మనము భోజనము చేయుచున్నాము. అనేకములైన భోగము లనుభవించుచున్నాము, విత్తనములు చల్లుదురు. నారు లేచును. ఊడ్తురు. మొక్క మొలుచును, కలుపు తీయుదురు, నీరు పెట్టుదురు, కంకులు వదలును. కోయుదురు. కుప్ప వేయుదురు. విత్తనములు పరంపరయా వచ్చును. తొలివిత్తనములసంగతి యేమి? దాని సంగతి నెవరు నూహించరు. ఒక దేశమునందు సమృద్ధిగా వరి పండుచున్నది. ఎవడో యెచ్చటినుండియో కొన్ని వందల యేండ్ల క్రింద యెంతో కష్టపడి తొలివిత్తనములు సాధించి తెచ్చెను. ఈ పంట యంతయు వాని చలువ. ఈ రహస్యము తెలిసినచో గాని నన్నయ్యగారి తొలిపద్యరచనలోని గొప్పతనము తెలియదు, కష్టము తెలియదు. బ్రహ్మలక్షణము తెలియదు.

మరి యిది చూడుఁడు:

నన్నయ్యగారి భారతములో ఉదంకుడు చేసిన నాగస్తోత్ర మున్నది. అవి ప్రసిద్ధములైన పద్యములు, దానికి మూలములు చూడుఁడు:

యే ఐరావత రాజానః సర్పాసమితి శోభనాః
క్షరంత ఇవ జీమూతాః సవిద్యుత్పవనేరితాః॥

సురూపా బహురూపా శ్చ తథా కల్మాషకుండలాః ।
ఆదిత్యవన్నాకపృష్ఠే రేజురై రావతోద్భవాః ॥
బహూని నాగవేశ్మాని గంగాయా స్తీర ఉత్తరే ।
తత్రస్థానపి సస్తౌమి మహతః పన్నగా నహం ॥
ఇచ్ఛేత్ కోఽర్కాంశు సేనాయాం చర్తు మైరావతం వినా ।
శతాన్యశీతి రష్టౌ చ సహస్రాణి చ వింశతిః ॥
సర్పాణాం ప్రగ్రహాయాంతి ధృతరాష్ట్రో యదైజతి ।
యే చైన ముపసర్పంతి యే చ దూరపథం గతాః ।
అహ మైరావతజ్యేష్ఠ భ్రాతృభ్యోఽకరవం నమః ॥
యస్యవాసుకి కురుక్షేత్రే ఖాండవే చాఽభవత్ పురా ।
తం నాగరాజ మస్తోషం కుండలార్థాయ తక్షకం ॥
తక్షక శ్చాశ్వసేన శ్చ నిత్యం సహచరా ఉభౌ ।
కురుక్షేత్రం చ వసతాం నదీ మిక్షుమతీ మను ॥
జఘన్యజ స్తక్షక శ్చ శ్రుతసే నీతి యచ్ఛ్రుతః ।
అవసద్యో మహాద్యుమ్ని ప్రార్థయ న్నాగముఖ్యతాం।
కరవాణి సదా చాహం నమ స్తస్మై మహాత్మనే॥

ఇది సంస్కృతభారతమునందు ఉదంకుడు చేసిన నాగస్తోత్రము. దీనిని నన్నయ్యగారు పద్యములలోనికి దింపిరి.

నన్నయ్యగారు వ్రాసినవి నాల్గు పద్యములు.

బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్రఫణాళి దాల్చి దు
స్సహతరమూ ర్తికిన్ జలధిశాయికి పాయక శయ్య యైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్.

అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండగా
నురగుల నెల్లఁగాచిన మహోరగనాయకుఁ డా నమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకు ప్రసన్నుఁ డయ్యెడున్.

దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాపసం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిల విపక్షులు నైన మహానుభావులై
రావతకోటి ఘోరఫణిరాజులు మాకు ప్రసన్నులయ్యెడున్.

గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్.

మూలమును తెలుగును కలిపి చూచినచో నెక్కువ పొంతన కనిపించదు. ఆయన త్రోవ యాయనది. ఈయన త్రోవ యీయనది. మూలమునందలి కొన్ని పునరుక్తులు తెలుగులో లేవు. తెలుగునందలి చిక్కనిరచన సంస్కృతములో లేనేలేదు. సంస్కృతమున రామాయణ భారతము లున్నవి. తరువాత కావ్యములు వచ్చినవి. నాటకములు వచ్చినవి. మూడింటియందలి రచనయు మూడు విధములు.

సంస్కృతమున వాల్మీకి రామాయణమును చదివి పలుమంది సులభముగా నున్న దందురు. తెలుగులో కూడ నట్లే రచన యుండవలయు నందురు. కిరాతార్జునీయము, మాఘము, రఘువంశము, కుమారసంభవము, నైషధము మొదలైన కావ్యములయందలి శైలికిని వాల్మీకిరామాయణముయొక్క శైలికిని సంబంధమున్నదా? తరువాత నాటకములలోని శ్లోకముల శైలికిని ఆ కావ్యముల శైలికిని సంబంధమున్నదా? తరువాత కవులు వచ్చిరి.

చంపూరామాయణ మున్నది. అలంకార గ్రంథములయం దుదాహృతములైన బహు శ్లోకము లున్నవి. ఈ తరువాతి తరువాతి శ్లోకము లెంత చిక్కగా నుండునో యెంత బిగిసి యుండునో! వాల్మీకి రామాయణము వ్యాస భారతము లందు నెక్కువ యనుష్టుప్పులు, కొన్నియార్యలు; తరువాతి తరువాతి కావ్యములందు భిన్నవృత్తములు; వాని పద్ధతి వేరు, వాని కూర్పు వేఱు. వాని బిగింపు వేఱు, వానిలోని పలుకుబడి వేఱు.

పురాణశైలి వేఱు. చాటువులశైలి వేఱు. నాటకములయందలిశైలి వేఱు. తరువాత వచ్చిన ప్రౌఢకవు లెవనికివాడు నిర్మించుకొనిన శైలులు వేఱు. కూర్పు

నిర్మించుటకు వీలున్నది. ఈ ప్రక్కన నది యున్నది. అని స్థలము చూపించి తొలుత నొక మహాసౌధమును నిర్మించి మార్గదర్శకుడైన వానిపేర మహానగరము చెల్లును.

ఈ యాంధ్ర సారస్వత మహానగర నిర్మాత నన్నయ్య, ఈ నాగ స్తవము చూడుడు. ఆ పద్యము లెట్లు వ్రాసెను. అట్లు వ్రాయవలయు నని యాయనకు బుద్ధియెట్లు పుట్టెను.

మూలములో ననంతుని ప్రసక్తి లేదు. ఇచ్చట మొదటి పద్యములో ననంతుడున్నాడు, ఇచ్చటి విశేషణములు వేఱు. ఇచటికూర్పు వేఱు.

మూలములో "అద్రినందనేశ్వరునకు భూషణం బయిన వాసుకి" లేదు. ఈ సమాసపుకూర్పు లేదు. ఈ మాధుర్యము లేదు. ఈ చిక్కదనము లేదు. పద్యరచనాశేఖరాయమాన మైన యీ శక్తి లేదు.

మరియు "మాకు ప్రసన్ను లయ్యెడున్" అన్న మకుటము నన్నయ్యగారు కల్పించినదే! ఇది వేదములలోనుండి తెచ్చికొనిన యొక చిన్న కాంతి.

సారస్వత బ్రహ్మ యనగా నిది.

సృష్టియందు చతుర్ముఖు డైన బ్రహ్మ సరస్వతిని సృష్టించెను. ఆయన యుండునది సత్యలోకము, కైలాసమును శివుడు వేఱ యున్నారు, వైకుంఠమును నారాయణుడును వేఱ యున్నారు, ఇంద్రుడును స్వర్గమును వేఱ యున్నారు. వాసుకియు తక్షకుడు పాతాళమును వేఱ యున్నవి. అవి యన్నియు భోగస్థానములు, అనుభవస్థానములు. కొన్ని యానందనికేతనములు.

సత్యలోకము వేఱు. సత్యలోకమునం దేమున్నది? బ్రహ్మ యున్నాడు, సరస్వతి యున్నది, ఆయన వాహనమైన హంస యున్నది. ఈమె వాహనమైన నెమిలి యున్నది. మహర్షు లున్నారు. వారి తపస్సు లున్నవి, ఆ సత్యలోకములను మిక్కిలిగా వర్ణించిన పురాణములు లేవు. అది బ్రహ్మదేవుని మొదటి సృష్టి కాబోలు! సరస్వతి మాత్ర మున్నది, అచట వెన్నెల లున్న వని చెప్పుటకును వీలులేదు,

సత్యలోక మనగా నేమి?

సత్య మన్న శబ్దము బహుధా వినిపించుచుండును. లోకములో నన్నృతము కానిది సత్యము. ధర్మమునకు మించిన సత్య మొక డున్నది. ఆ సత్యముయొక్క

స్వరూపము వాజసనేయమందు చెప్పబడినది. సర్వసృష్టియు నున్నది. ఇది నడచుచున్నది. ఇది యంతయు పూర్వనిబద్ధమైన వ్యవహారము. అనంత జీవుల కర్మ సమాహారభూతమై కాలముచేత విప్పుత మగుచు విప్పుతము కానిస్థితి గుఱిగి వలె బీజమువలె సర్వసంక్షిప్తి కలిగి యుండునది సత్యము. సర్వధర్మము లందులో నున్నవి. సర్వసృష్టి యందులో నిమిడియున్నవి. విప్పుతమై ప్రపంచ మగు చున్నది. వివృతమై ధర్మ మగుచున్నది. దానిపేరు సత్యము.

సత్యలోక మనగా నది యేమో!

నన్నయ్యగారి రచన యాసత్యలోకము వంటిది. అం దన్నియు నిమిడి యున్నవి. ఒక్కొక్కటి విడివిడిగా ప్రపంచితమై క్రొత్త వస్తువువలె కన్పిం చును. ఇంద్రు డింద్రునివలె కన్పించును. అతడు ముల్లోకములరు రాజు. శివుడు శివునివలె కన్పించును. అతడు బ్రహ్మకంటె గొప్పవాడు. అతనిని సృష్టిచేసినది బ్రహ్మ.

ఎచ్చటనో చదివితిని బ్రహ్మ రాగా శివుడు లేచి నిలుచుండి మర్యాద చేసెను.

అట్టిమర్యాదనే తిక్కన్న నన్నయ్యగారి ముందు నెరపెను. 'ఆంధ్రకవిత్వ విశారదుండు విద్యాదయితుండు' అని. ఆంధ్ర కవిత్వమునకు సంబంధించిన వఱకు నన్నయ్య విద్యాదయితుడు- సరస్వతీపతి-బ్రహ్మ.

ఇది నన్నయ్యగారి పద్యరచనా రహస్యము. తిక్కన్నరచన వేఱు. శ్రీనాథునిరచన వేఱు. పోతన్నరచన వేఱు. పెద్దనాదుల రచనలు వేఱు. వారు నిర్మించిన కావ్యలోకములువేఱు. అచటి భోగశక్తులు వేఱు. అచటి సుఖములు వేఱు. వానివైశాల్యములు వేఱు. వాని సృష్టికర్త నన్నయ్య.

ఇదియొక విద్యకదా! ఈవిద్య యిట్లుండవలె నని నిర్ణయించిన వాడు నన్నయ్య. సర్వాంధ్ర కవులు వేయియేండ్లు నన్నయ్యగారి ననుసరించిరి. చెప్పబడి నదికదా! మహాగ్రంథములు నిర్మించిరి. ఆంధ్రభాష కొక సారస్వత మున్నదని నిరూపించిరి. ఆసేతుశీతాచలమునందున్న పలుభాషలలో నేభాషకు నప్పుడప్పుడు కొమ్మలు మొలచినను నాకొమ్మలు బూరుగుచెట్టుకొమ్మలతో చేసిన పని నిరూ పించగలిగిన మహాసారస్వత నిర్మాణమునకు నన్నయ్యగారు పునాదులు వేసెను.

ఇవన్నియు నాయనపద్యరచనలోని రహస్యములు. ఒక తిక్కన్న గాని ఒక్క శ్రీనాథుడు కాని ఒక పెద్దన్న గాని ఒక నాచన సోమన్న గాని తాము నిర్మించిన మహాకావ్యములు తామే బ్రహ్మల మన్నట్లు తన్మహాశక్తులచేత భ్రాంతులైన జనముల కనిపించినను వానిపునాదు లన్నియు నన్నయ్యగారిలో నున్నవి.

ఈయాంధ్రసారస్వతమున తిక్కన్నగా రొకడు మహానుభావుడై యున్నాడు. ఆయన పద్యరచన యొకటి తదుపజ్ఞకమా? యన్నట్లుండును, కాని యది నిజము కాదు. తిక్కన్నగారి రచనకు మూలములైన పద్యములు నన్నయ్యలో ననేకము లున్నవి.

వెనుక నెప్పుడో నొకయాకాశవాణి ప్రసంగమునందు వాని నెత్తి చూపించితిని. తిక్కన్నయే కవి మరొకడు కా డనుకొనుచున్న తెలుగుదేశమునందు ప్రసిద్ధుడైన యొకవిమర్శకుడు నివ్వెఱపోయెను. సరిగా తిక్కన్నగారి పద్యములవంటి పద్యములే యేరినారే! యనినాడు. నిజమే! నన్నయ్య కవిత్వము బీజములవంటిది. పండించినచో పదిపుట్లు పండును. బీజములు రెండు తూములే!

నముచి యను దనుజుఁ డుగ్రత
పము సేయుచున్నవాని బలమథనుఁ డధ
ర్మమున వధియించి రిపుప
క్షము నెమ్మెయినయిన చెఱుపఁ గావలె నిలన్.

కొద్దిలో నీపద్యము తిక్కనగారిమహాకవితావృక్షబీజము.
ఇట్టి వెన్నియో కలవు.

ఇది యిట్లుంచి యొక మహావిషయ మున్నది. నన్నయ్య సంస్కృత భారతమును తెలుగుచేయుచున్నాడు. ఒక సాహిత్యవాదము కలదు. ఆనాడు కర్ణాట భాషయు తెలుగు భాషయు నించుమించుగా నొక్కటియే యని. అది హొసగన్నడము. ఇది తెలుగన్నడము నని. తెలుగన్నడము తెలుగైన దనిరి. కావచ్చును.

మన తెలుగులో నన్నయ్యగారి భారతము పుట్టకమున్నే కన్నడములో కావ్యము లున్నవని. అంతేకాదు. కన్నడములో నున్న యొకకవికావ్యము ననుసరించి నన్నయ్య వ్రాసె నని. అదియు కావచ్చును. అవియన్నియు మన కెందులకు?

ఇచట నొక మహావిషయ మున్నది. వెనుక గొప్ప సంస్కృత సారస్వత మున్నది. ఇచ్చట నొక దేశభాషా సారస్వతము సృష్టించబడుచున్నది. ఎట్లు సృష్టింపవలయును? సంస్కృతములో అనుష్టుప్పులు ఆర్యలు శిఖరిణీమందాక్రాంతా స్రగ్విణీ మాలినీ ప్రముఖ బహువృత్తమయమైన మహాసారస్వతము కలదు. సంస్కృతములో శార్దూలవృత్తము కూడ నెక్కువగా వాడబడియున్నది. మత్తేభవృత్తము సంస్కృతభాషలో నెక్కువగా వాడబడియున్నట్లు లేదు. ఉత్పలమాల చంపకమాలలు సంస్కృతములో వాడబడనే లేదు. ఉత్పల చంపకమాలలును శార్దూలమత్తేభములును విస్తారముగా తీసికొని సారస్వతమును సృష్టించవలయును. సంస్కృతమున నార్యావృత్త మెటువంటిదో తెలుగులో కంద పద్య మటువంటిది. అచట నార్యావృత్తములో నెన్ని భేదములు కలవు. తెలుగులో కందపద్యములో నన్ని భేదములు కలవు. అన్నిటిని త్యజించి ప్రసిద్ధమైన యీ కందపద్యమునే తీసికొనవలయును. సీసపద్యమును రెండువిధములైన గీతపద్యములను దీసికొనవలయును. ఇవి ప్రధానమైన యాంధ్రసారస్వతసృష్టికి స్వీకరింపదగిన వృత్తములు. ఈనిర్ణయమును చేసిన దెవరు? నన్నయ్యగారు.

ఎందుకు చేసినారు? ఇది చేయుట సామాన్యమా? సామాన్యము కాదు. ఏల యనగా? దీనికి బ్రహ్మ కున్న వివేకము కావలయును. ఛందశ్శాస్త్ర మున్నది. బహువృత్తము లున్నవి. ఒక్కొక్కవృత్త మొక్కొక్కనడక నడచును. ఈ వృత్త మిట్లు నడచునని చెప్పుటకు వీలులేదు. నడచినచో నేమి?వృత్త మెందులకు? భావమును చెప్పుటకు. భావమును నిబంధించుటకు. ఆభావమునకు నీవృత్తమునకు నేమి సంబంధము?

భావ మనగా నేమి? ఊహ వచ్చును. అది వాగ్వృత్తి నవలంబించును. అవలంబించినప్పుడు భిన్నశబ్దాకారమును పొందును. ఆశబ్దము లోకవాక్యముగా నేర్పడును. ఆశబ్దములయందు గాని యీవాక్యములందు గాని యేమున్నది? సూక్ష్మముగా జూచినచో నాయూహలో నేమున్నదో వీనిలో నదే యున్నది. ఆయూహలో నేమి యున్నది? ప్రపంచకముయొక్క నడక యున్నది. ఇంద్రియానుగతమైనదియు ఇంద్రియాతీతమైనదియు నైన లోకము అనగా లోకములయొక్క సమాహారభూతమైన లక్షణము ఖండశః ఆయూహలో నున్నది. అట్టియనేకములైన యూహలలో తల్లక్షణము విస్తారముగా నుండును. కాని అస లది యేమి! ఏమి వస్తువు? అది యింతకుముందు చెప్పిన సత్యముయొక్క ప్రతిచ్ఛాయ.

మమ్మటుడు తన కావ్యాదియందు "నియతికృతనియమరహితాం" అని వ్రాసినాడు. నియతి యనగా సృష్టి. ఇది గట్లు త్రెంచుకొని పోవునది కాదు. సర్వము హద్దులలో తిరుగునది. కర్ణాటక సంగీతమునందు దక్షిణదేశమున మహా మార్దంగికు లున్నారు. వారివిద్య యాశ్చర్యజనకము. పాశ్చాత్యులు నివ్వెఱపోదురు. అది యొక తాళము. అది యొకలయ. ఒక పరిధిలో గిరగిర తిరుగుచుండును. దాని పెంపకమునకు హద్దు లేదు. లయ యనగా నట్టిది. లయ యనగా నది. దానిలో నది తిరుగుచుండును. దానికి హద్దు లున్నవి. అది హద్దులను దాటిపోదు. దానికి ప్రసిద్ధములైన మార్గము లున్నవి. గాడు లున్నవి. అందులోననే తిరుగును. మానవు డూహించును. ఏమి యూహించును? ఐహికాముష్మికములను దాటి యూహించునా? దృశ్యమానమగుచున్న ఊహ్యమానములగుచున్న విషయములను దాటి యూహించునా? ఇది యొక పెద్దలయ. దానిని పెంచినచో సృష్టి యైనది. కుదించికొన్నచో సత్య మగుచున్నది. ఇది యొక పెద్దరహస్యము,

కనుక మనయూహకు మనమాటకు నిత్యసంబంధము. ఇది యొకలయ. ఆయూహ సృష్టిలోని యొకగీత. మద్దెలమీద వేసిన యొకదెబ్బ. అట్టిది వాక్యము.

ఆలయలో నేమున్నది? భావ మున్నది, అది వాగ్రూపముగా వచ్చినప్పుడే యున్నది. దానిలో నదియే భావ మున్నది.

ఇప్పుడు ఛందశ్శాస్త్రము వచ్చినది, ఇది విద్య. మనుష్యనిర్మితమైన దన వచ్చును. లేదా మనుష్యునియొక్క వివేకముచేత వివరించబడి శాస్త్రముగా జేయబడినది అనేకఛందస్సులు కలవు. అనేక భావములు కలవు. అనేక వాక్యములు కలవు. అన్నిభావములయందు అన్నివాక్యములయందు వానివానికి తగిన లయ యున్నది. ఛందశ్శాస్త్ర మెందు కేర్పడిన దనగా ఈఛందోవికారమునందు ఈ వృత్తమునం దొక లయ యున్నది. ఆవాక్యమునందు ఆభావములం దొకలయ యున్నది. అచ్చట నున్న లయకు ననుగుణమైనలయ ఏఛందస్సునందున్నది? ఏలయయం దున్నది కనుగొని మహర్షికల్పుడైన కవి నిర్ణయించును. మహర్షి కల్పుడైన భావుకుడు గ్రహించును.

"నానృషిః కురుతే కావ్యమ్'' అన్న వాక్యములోని ప్రధానార్థ మిచ్చట నున్నది. నాల్గుమాటలు కూర్చిన ప్రతికోణంగికవియు ఋషి కాడు.

ఈ మహార్థ మెప్పుడు తెలియును? నీవు ఋషివి కావలయును. నీవు తపశ్శాలివి కావలెను, స్వాధికల్పకమైన యొకలక్షణము పొందగలస్థితి నీయం దుండవలయును. భగవంతుడు నీకేదో చెప్పుచున్నట్లు నీవు భావించెడిశక్తి నీకుండవలయును. ఇంక నెన్నియో లక్షణములు కావలయును. అప్పుడు కవివి. తక్కినప్పుడు కవిత్వము నీకొకవృత్తి, అది నీకొక యుద్యోగసాధనము. అది నీదురహంకార ప్రావిర్భావమునకు నొకవెసులుబాటైన లక్షణము, నీవు వందలాది పుస్తకములు వ్రాయవచ్చును. వేలు సంపాదింపవచ్చును. రాజ్యములు తల్లక్రిందులు చేయవచ్చును. లక్షలాదిబహుమానములు పొందవచ్చును. దానికి సంబంధము లేదు.

ఇట్లుండగా నీరీతిగా నూహయందు భావమునందు తదనుబంధివాక్యమునందు కల లయను గుర్తుపట్టి దానిలక్షణము కల ఛందస్సును వృత్తమును గుర్తుపట్టి వ్రాయుటపేరు విద్య.

గురుపద్యవిద్యకు నాద్యు డని వాల్మీకిని నన్నయ్య యన్నప్పుడుగాని అది తనకుకూడ ననువర్తించవలయునని నన్నయ్యగా రనుకొనియుండవచ్చు నని మన మనుకొన్నప్పుడుగాని యర్థ మిది. అప్పు డది పద్యవిద్య యగును. విద్య యనగా నేమి? చదువు జ్ఞానముకదా! ఇది జ్ఞానము.

ఇది యిట్లుండగా నొకభాష యున్నది. కోట్లాది జనులచేత వాడబడుచున్నది. ప్రవాహముగా నున్నది. పరంపరగా వచ్చుచున్నది. దానికి నీవు తొట్టతొలుత లక్షణము వ్రాసి దానిలో కావ్యము వ్రాయుచున్నావు. ఇందాక రెండు మహావిషయములు చెప్పబడినవి. ఒకటి భావమునందలిలయ. వాక్యమునందలి లయ. రెండవది ఛందోవిషయికమైనలయ. వృత్తగతమైనలయ. ఇవి యట్లుండగా మూడవవిషయము వచ్చినది. అది తెక్కలు చాచికొన్న గరుడివలె వేలాది ప్రజలచేత వాడబడుచు విస్తారమైన రూపమును పొందియున్నభాష. అట్టిభాషయందు పరమేశ్వర సంకల్పితమై బహుజన వాఙ్నిర్ణీతమై యొకశక్తి యున్నది. ఆశక్తి యిదివఱకే వివృతమై యున్నది. లయప్రస్తారమును పొందియున్నది. ఇప్పు డేమి చేయవలయును? ఇక్కడ ఛందస్సున్నది. అక్కడ నభిన్నములైన భావభాషల యొక్క లయ యున్నది. ఇక్కడ నొకమహాభాష విస్తరించియున్నది. అక్కడ నొక మహాసారస్వత మున్నది. ఈనాల్గుమహావిషయములనడుమ విస్త

రించియున్న ఈమహాభాషా స్వరూపమునకు కొన్ని వృత్తములను నిర్ణయించు కొనవలయును.

ఒకభావము దానికి తగిన శబ్దసముదాయము. దానికి తగిన వృత్తము నెన్నుకొనుట. ఇది స్వల్పపుపని. ఇదికాదు. విస్తరించియున్న భాష యున్నది. అందులో నొకకావ్యమును వ్రాయవలయును. ఆచిన్నపనికిని దీనికిని సంబంధము లేదు. ఒకమహాకావ్యము వ్రాయుటలో ననేకభావములు వచ్చును. కొన్ని విలక్షణ ములైన భావములు వచ్చును. ఆచిన్నపని అట్టివిలక్షణములైన భావములు వచ్చి నప్పుడు చేయవలసినపని. ఇది వేఱే పెద్దపని. ఒకవ్యక్తియొక్క జీవితములోని గమనిక వేఱు ఒక సంఘముయొక్కగమనిక వేఱు. ఒకజాతియొక్కగమనిక వేఱు. ఒక సంఘమో! ఒకరాజ్యమో! ఒకజాతియో! నడుపబడవలె ననగా నొక మహామంత్రి కావలయును. మహర్షికల్పుడైన మహామేధావి కావలయును. అధికారధూర్వహులైన సంఘ దుర్జనులు పనికిరారు. వారిచేత జాతి చెడును. సంఘము చెడును. అట్లే నన్నయ్యగారియెదుట సాక్షాత్కరించిన సమస్య చాల గొప్పది. వట్టిపద్యరచనామాత్రపరిజ్ఞానవంతుడైన కవిమాత్రము నన్నయ్య గారు కాడు. ఆయన మహర్షి. అందుచేత నన్నయ్యగారు భాషాస్వరూపమును భాషాస్వభావమును భాషాశక్తిని భాషాస్వత్వమును పరిశీలించి నిర్ణయించి యీ యాంధ్రభాషాసారస్వతమునకు నీవృత్తములు ప్రధానముగా నుండవలయు నని నిర్ణయించెను. భాషాసంపూర్ణస్వరూపము ఛందస్సంపూర్ణస్వరూపము నెఱిగి యున్నవాడు గాని దీనిని నిర్ణయించలేడు. ఎంత లయ యున్నను సామాన్య భాగము సామాన్యముగనే యుండును. సమానముగనే యుండును. ఒక తాళ మును తీసికొని మహామార్దంగికు డూహించుచుండును. ఒక స్వరమును దీసికొని మహాగాయకుడు పెంచుచుండును. ఒకరాగమును ప్రస్తరించుచుండును. విశే షములను ప్రదర్శించుచుండును. మరల సామాన్యమైనదానివద్దకు వచ్చు చుండును. పల్లవి యున్నది. కీర్తన యున్నది, పల్లవి కీర్తనకు ప్రధాన స్థానము. అది ధ్రువము. అట్లొక మహాభాషలో ధ్రువలక్షణము కలిగినలయ యొక టుండును. ఆ లయ ప్రధానముగా నేవృత్తముల నాశ్రయించి యుండును? ఇది ప్రశ్న.

ఆంధ్రభాషలో మొట్టమొదట మహాకావ్యనిర్మాణ మహాకార్యవ్యగ్రుడైన నన్నయ్యగారి మొదటినిర్ణయ మిక్కడ కావలసి వచ్చెను.

మహర్షికల్పు డైన నన్నయ్య యీ నిర్ణయమును చేసెను. ఉత్పల మాల, చంపకమాల, శార్దూల మత్తేభములు, కందపద్యము, సీసము, గీత పద్యము వీనిని సర్వాంధ్రమహాకావ్యప్రధానశరీరభూత మైన ఛందస్సులుగా నిర్ణయించెను. వానికి కావ్యాకృతి నిచ్చెను. తరువాత మేరుశిఖరములవంటి కవులు రావచ్చును. గంగానదులవంటి కవులు రావచ్చును. మార్గ మిదియే. ఇది నన్నయ్యగారి గొప్పదనము.

బ్రహ్మ యనగా నిది. సత్యలోకమున కధిపతి యైన బ్రహ్మ. తొలి సృష్టి చేసిన బ్రహ్మ కాదు. తొలి సృష్టినిబట్టి మలిసృష్టిని చేయవచ్చును. తొలుతటి సృష్టిని జేసిన బ్రహ్మ సృష్ట్యాశక్తిమంతుడు. తరువాతి బ్రహ్మ తన పనిని తానే యనుకరించుచున్నవాడు; అనుసరించుచున్నవాడు. అక్కడివా డొక్కడే యైనను నిక్కడివారు భిన్నులు. "అంబురుహగర్భనిభుడు."

ఈ రీతిగా నొక భాషలో మహాసారస్వత నిర్మాణము మూడు మహా విషయములమీద నాధారపడి యుండును. అదికాక అక్షరశక్తి, వాక్య నిర్మాణశక్తి, మూడవది భాషాశక్తి.

అక్షరశక్తి వృత్తిరీతిశయ్యాపాకశబ్దగుణాదులను సంతరించుటకు తెలిసికో దగినది. వాక్యనిర్మాణశక్తి కాక్వాక్షిప్తము, వాక్పటుత్వము, కొన్ని భావములు సమర్థముగా శక్తిమంతములుగా చెప్పుటకు నుపయోగపడును. మూడవది భాషాశక్తి. భాషయందు నానుడులు, మాటపాటులు, సామెతలు సమృద్ధిగా నున్న భాషయైనచో కవి వానిని సంతరించుకొనక తప్పదు. వాని యర్థములు వాని పాటులు చెడకుండ చూచుకొనుట, భాషాశక్తిని నిలబెట్టుట. అటువంటి సమయములలో నవి యన్నియు కొన్ని గణములుగా వాని యంతట నవియే విభక్తములై యుండును. లేదా కొన్ని గణములకు లొంగి యుండును.

ఇదివరకే కొన్ని గణములకు లొంగియుండె ననగా నవి సర్వవృత్తములకు పనికిరా వని యర్థము. ఆ గణములు తమలో వరుసగా నున్న వృత్తములకే పనికి వచ్చును.

ఇట్టి స్థితిలో ఆదిలో లయ యని యేది చెప్పఁబడినదో ఆ లయ కవి యొక్క యుపజ్ఞను దాటి భాషాగతమైన యొకయుపజ్ఞకు లోబడి యున్న

దని యర్థము. అప్పుడు కవి యీ రెంటిని సర్దుకొనవలయును. భాషయొక్క మర్యాద నుల్లంఘించరాదు. భావముయొక్క లయను చెడగొట్ట గూడదు. అప్పుడు వృత్తము నెన్నుకొనుట కొంత క్లేశమగును, ఆ మాటలపాటు కొన్ని వృత్తముల కనుకూలించును. ఆ వృత్తములలో నేది యనుకూలించునో దాని నెన్నుకొనవలసి యుండును.

ఇది యంతయు కవియొక్క యుపజ్ఞమీద నాధారపడి యుండును.

ఒక్క మన తెలుగుభాషలో వేలమంది కవు లున్నారు కదా! ఇంత మందిలో వేయియేండ్లమీద ప్రసిద్ధులైన కవులసంఖ్య చాల తక్కువ కదా! ఇది యెందుచేత నన్న ప్రశ్న నూత్నకవులకును, భావుకులకును, పాఠకులకును, నుండవలయును. ఏవో పద్యము లున్నవి, కావ్యము లున్నవి, అచ్చు వేసికొను చున్నాము, సారస్వతముగా వెలయించు కొనుచున్నాము-మొదలైన తృప్తి పరిశీలితమైన తృప్తికాదు. పరిశీలనము కావలెను. జాగ్రత్త కావలెను.

నన్నయ్యగారు తాను కావ్య నిర్మాణము చేసినప్పుడు జాగ్రత్తగా నీమహా విషయములన్నియు నాలోచించియే చేసెను. అందుకనియే యాయన కావ్యము మకుటాయమానముగా నున్నది. ఆయన ననుసరించిన వారిలో కనీసము పది మంది యైనను మకుటాయమానములైన గ్రంథములను రచియించ గలవారైనారు.

సంస్కృతభాషలో చంపువులు వేఱు. కావ్యములు వేఱు. కావ్యము లనగా నచ్చముగా పద్య కావ్యములు. వాల్మీకి రామాయణము సంపూర్ణముగా పద్యమయము. వ్యాస భారతములో తొట్టదొలుత కొన్ని వచనములు కలవు. స్థితి యిట్లుండగా నన్నయ్యగారు ఆంధ్ర సారస్వతమున "హరిః ఓం" అని మొదలు పెట్టుచు పద్యగద్యమయమైన కావ్యమునే ప్రారంభించెను. దీని రహస్య మేమి? తరువాత తరువాత నాంధ్ర సారస్వతమున నిర్వచన కావ్యములు బయలు దేఱినవి. తిక్కన్నగారే మొదట నిట్టిది యొకటి వ్రాసెను.

లోకములో పాఠకులలో ననేకములైన యభిమానము లుండును. ఒక మహాకవి యొక గ్రంథమును వ్రాసినచో నా మహాకవి యందలి యభిమానము చేత జను లాగ్రంథమును గూడ జదువుచుందురు. సూక్ష్మపరిశీలన జనమునకు తక్కువ. తిక్కన్నగారు వ్రాసిన "నిర్వచనోత్తర రామాయణము"నకు కంకంటి

పాపరాజుయొక్క "ఉత్తర రామాయణము"న కున్న ప్రశస్తి లేదు. ఒక గ్రంథముయొక్క ప్రశస్తి బహువిషయములమీద నాధారపడి యుండును.

ఇంతకుముందు చెప్పబడిన మహా విషములయొక్క సంపుటి భావితమై పాఠకునియొక్క మనసులో జీతించి యొక యనుభూతి సహజప్రాదుర్భూతమై కలిగించెడి యానందము వేఱు. మానవస్వభావము పలుకుబడి, కవియొక్క చిన్నచిన్నశక్తులు వీని సమాహారముచేత కావ్యైకదేశములందు గలిగెడి యానందము వేఱు. ఒకదానిని జూచి మరియొకటి యని భ్రమ పొందగూడదు.

ఒకమహావిషయనిర్ధారణమునందు కాలఖండములయందున్న భావుకుల కంటె నఖండకాలమునందున్న భావుకులబుద్ధి ప్రమాణము. అనఁగా కొన్ని వందలయేండ్ల మీద నొక కావ్యము గడించుకొన్న ప్రశస్తి చిరమైన ప్రశస్తి యని యర్థము.

ఇప్పుడు గద్యమును పద్యమును రెండున్నవి. ఇవి రెండును కలిపిన కావ్యము చంపువు. నాటకములలో నివి కలిసి యుండును. నాటకములలో నెందుకు కలిసి యుండును ?

పాశ్చాత్యదేశములలోని నాటకములు రెండు విధములుగా నున్నవి. కొన్ని సంపూర్ణముగా పద్యనాటకములు. కొన్ని సంపూర్ణముగా గద్యనాటకములు. సంస్కృతనాటకములు గద్యపద్యోభయమిశ్రితములు.

ఉన్నవానిని ఉన్నట్లుగా విచారించుట వేఱు. అట్లెందు కున్నవని విచారించుట వేఱు. అట్లెందు కున్నవని విచారించుట తత్త్వవిచారణ.

సంస్కృత నాటకములలో నది గద్యపద్యోభయ మిశ్రితముగా నుండుట విచారించినచో స్థూలముగా కనబడుచున్న కారణ మొకటి. సామాన్యములైన భావములు గద్యములలో చెప్పబడి ఉదాత్తములైన భావములు పద్యములలో చెప్పబడినట్లు కన్పించును. ఆ యుదాత్తములైన భావములు చెప్పుటలో కూడ రచనలో కొంత పాటవము నెఱపుటకు ప్రయత్నము చేసినట్లు కన్పించును. భావితమైన యౌదాత్త్యమును రచనాశక్తిచేత శబ్దశక్తిచేత మరియు నధికముగా భాసింపజేయుటకు చేసిన ప్రయత్నము సువ్యక్తమగును.

ఏ భాషలో నైనను సామాన్యములైన భావములు ఉదాత్తములైన భావ ములు తప్పకుండ నుండును గదా! అ య్యాదికవులు వానిని విడమరచి కావ్య పాఠకులకు నేర్పరించి పెట్టవలయును. ఆ ప్రయత్నమును నన్నయ్యగారు తొలు తనే చేసి పెట్టెను. సంస్కృత సాహిత్యమున నాటకదశ వచ్చువఱకు నిట్టి ప్రయత్నము జరిగినట్లు లేదు. ఆంధ్రసాహిత్యములో నన్నయ్యగారు దీనిని మొట్టమొదటనే చేసి పెట్టిరి.

ఇట్లు చేయుట సారస్వతమునకు కొంత నష్టము కలిగిన దని చెప్పవచ్చును. తెలుగులో నిది స్వతంత్రముగా నాటకములు బయలుదేఱుటకు తొందఱగా తెలి యని యడ్డంకియై యుండెను. కవుల కీవిభాగము చేసెడి నేర్పు కావ్య రచన యందే వెలయించుకొనుటకు వీలైనది.

నాటకమున కుండవలసిన లక్షణము లనేకములలో నిది యొకటి. ఐనను దానిమటుకు నది కొంత యడ్డంకి యైన దనియే చెప్పవలయును.

ఇది యిట్లుండగా నొకజాతి బ్రతుకుచున్న దనగా నా జాతియొక్క జీవన ములో సామాన్యవిషయములు విశేషవిషయములు భిన్నభిన్నములుగా నుండెడి బ్రదుకు బ్రదికెడి లక్షణముగల జాతి యైనచో— స్థూలముగా నాధునికబుద్ధితో నిట్లుండును: గద్యపు బ్రదుకు పద్యపు బ్రతుకు— అని యున్నచో నా రెండు బ్రదుకులు తెలుగుజాతి విడివిడిగా బ్రతుక కలదని యర్థము. ఆ బ్రతుకులు రెండును విస్పష్టముగా విభాగించవచ్చు నని యర్థము.

ఎంత విభాగింపవచ్చు ననగా నాంధ్రభాషలో తొట్టతొలుత కావ్యనిర్మా ణము చేయవలెనన్న బ్రహ్మ దీనిని పెడద్రోయలేక పోయినాడు. అందుచేత నాయన గద్యపద్యాత్మకమైన కావ్యనిర్మాణమునే ప్రారంభించుచు చేసినాడు.

ఇది భాషాగత శక్తి. నన్నయ్యగారు గుర్తుపట్టినా దనుట మాత్రమే; బ్రహ్మ గనుక జూచినాడు.

ఇంతకంటె నొక మహా విషయ మున్నది. ఆంధ్రభాష అనాదినుండియు తత్సమ తద్భవ దేశ్యశబ్ద బాహుళ్యమైన భాష. ఒక దానికి రూప మేర్పడిన తరువాతగాని జనులకు వెల్లు లెక్కవు. ఆ స్థి యున్నచో వారసులు నన్నదమ్ములు

జ్ఞాతులు భిన్నపరిస్థితులయందు పంపకముల గూర్చి యభియోగములు, విరోధములు, కొట్లాటలు తెచ్చికొందురు. ఆ కుటుంబమున తగినంత యాస్తిని ప్రోవు చేసిపెట్టిన మూలపురుషు డున్నాడు. అతఁడు వీరందరు కొట్లాడుకొన దగినంత యాస్తిని సమకూర్చి పోయినాడు. లోకమునం దీ స్థితి యున్నది.

మరియు నెంతో యాస్తి యున్నది. దానములు చేయుటలు, దైవములకు వ్రాసి యిచ్చుటలు నెక్కువగా నాస్తి యున్నప్పటి మాటలు. అట్లే భాషావిషయమున కూడను. ఒక మహాకావ్యనిర్మాణము జరిగిన తరువాత భాషలో ననంతము లైన శబ్దములకు స్థితి యేర్పడిన తరువాత వాక్యవిన్యాసము వాక్యాన్వయము వ్యాకరణము నన్నియు నేర్పడిన తరువాత భాషావిభాగము కొఱకు జనులు పోరాడవచ్చును. తగాదాలు పడవచ్చును.

ఒక శైవమత మున్నది. మేము తెలుగు మాటలే వాడుదుము. అది యొక పెద్ద ఉద్యమము. దానియందు కావ్యములు పుట్టవచ్చును. అచ్చతెనుగు కావ్యములు నిర్వచనకావ్యములు, ద్విపదకావ్యములు, ఎన్నియైన రావచ్చును. తొలుత నన్నయ్య వ్యాకరణము వ్రాసి కావ్యమును వ్రాసి యాంధ్రభాషలో నున్న సర్వశక్తులు నిర్ణయించి పెట్టినాడుకదా! అవి యన్నియు తరువాత నాడెడు నాటలు.

మరి నన్నయ్యగారు ఆంధ్రభాషాస్వరూపమును నిర్ణయించి పోయెను. ఆంధ్రభాషాస్వరూప మనుటకంటె ఆంధ్రకావ్యభాషాస్వరూప మనుట మంచిది.

అది యెట్టిది? సంస్కృత భాషా మిశ్రిత మైనది. కావ్య మనుటతోడనే కావ్యభాష యనుటతోడనే సంస్కృతమును వదలిపెట్టి తెలుగునకు ప్రాణము లేదు. ప్రాణము లేదనగా కావ్యమునకు వలసిన శక్తి లేదు అని యర్థము.

ఇది భారత దేశము. అనేకభాషలలో నాంధ్రభాష యొకటి. సర్వభారత దేశమునకు వెనుక నొకమహాభాష యున్నది. అది సంస్కృతభాష. మేరుపర్వతసమాన మైనది. అం దీజ్ఞాన మున్న దీ జ్ఞానము లేదని లేదు. వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు ఇతిహాసములు కావ్యములు నాటకములు చెప్పుటకు వీలు లేనంత మహాభాండార మున్నది. భారత దేశమందలి ఏ భాషయు,

ఏ జాతియు, దానిని వదలిపెట్టి వేఱ బ్రదుకు బ్రదుకలేవు. సంస్కృతమును వదలిపెట్టి భారతదేశమున నేభాష యేమి చేయగలదు ?

ప్రస్తుతము నన్నయ్యగారు తెలుగులో కావ్యనిర్మాణము చేసినారు. వెనుక నా మహాపర్వతమును జూచుకొనియే చేసినారు. జీవితసర్వమహాశాఖలలో నామహాపర్వతముయొక్క ఛాయలు పడునవియును, ఒక్క కావ్యముమీద పడనవియునా ?

కావ్యనిర్మాణమునం దాఛాయలు మాకు వలదు అన్నచో కావ్యమునకే నష్టము. ఇందు కనేకములైన హేతువులు కలవు

ఒకటి, భారతము సంస్కృతములో నున్న దానిని తెలుగులోనికి దింపుచున్నాడు గాని స్వతంత్రముగా వ్రాయుటలేదే !

అది యట్లుంచి నన్నయ్యగారు తెలుగులో పు రా ణ ము ను వ్రాసినను వ్రాయుచున్నను కావ్యపద్ధతిగా వ్రాసినాడు; నాటకపద్ధతిగా వ్రాసినాడు. అనగా నొక భాషా సారస్వతము చిన్నచిన్నగా అల్పాల్పముగా కొన్ని వందల యేండ్లు బ్రతికిన తరువాత తా నెత్తవలసిన మహాకావ్యరూపమును తొట్టతొలుత తానే సంతరించి పెట్టినా డని యర్థము. ఇది నన్నయ్యగారు చేసిపెట్టినపని.

ఆంధ్ర సారస్వత కాలమున నాంధ్రశారదకు నన్నయ్యగారు కొన్ని వందల యేండ్లు కలసి వచ్చునట్లు చేసినా డని యర్థము.

మరియొకభాషలో నైనచో చిన్నిచిన్నిగ్రంథములు కొన్ని వచనగ్రంథములు కావ్య మనిపించుటకు వీలులేని కొన్ని పద్య గ్రంథములు. శారదాదేవి బహుప్రయాసపడి కొన్ని వందలయేండ్ల మీద నొకమహాకవి జన్మించి యతఁడు మొదట కావ్య మనిపించుకొన దగిన దానిని వ్రాయును. అప్పటినుండి యాభాషకు కావ్యశారదారూప మేర్పడును.

నన్నయ్యగారు మొదలుపెట్టుచునే యాంధ్రశారద కీరూపమును నిర్ణయించిపెట్టెను. నన్నయ్యగా రాంధ్రసారస్వతమున కామెప్రయాణములో కొన్ని వందలయేండ్లు కలసివచ్చెడునట్లు చేసెను. ఇది యాశ్చర్యము. ఎవ్వరు నూహించుటలేదు. ఇది యెట్లు చేసెను? బ్రహ్మ గనుక చేసెను. అంబురుహగర్భనిభుడు గనుక చేసెను.

కావ్యమర్మవిదుడు గనుక చేసెను. కావ్యమునకు వృత్తిరీతిపాకరసభావ గుణవ్యంగ్యములు ఆయువుపట్టు లని తెలిసినవాడు గనుక జేసెను.

సంస్కృతమును ప్రధానముగా దీసికొనెను. సంస్కృతశబ్దమిశ్రితమైన భాష యాంధ్రభాషగా స్వీకరించెను. వట్టి సంస్కృతమిశ్రితభాష కాదు.

తిజంతమును కారకమును వదలిపెట్టినచో సంస్కృతవ్యాకరణమంతయు సంస్కృతశబ్దప్రపంచకమంతయు తనవెనుక నున్న యాంధ్రభాషను స్వీకరించి దానియందు కావ్యమును నిర్మించెను.

అచ్చముగా వట్టి దేశ్యమైనభాష తీసికొన్నచో నీవ్యవహారము పొసగదు.

కావ్యగుణము లున్నవి. సౌకుమార్యము మాధుర్యము, ప్రౌఢి, ఓజస్సు మొదలైనవి. వట్టిదేశ్యపదముల సమకూర్చుటతో సౌకుమార్య గుణము రావచ్చును. కొన్నికల్పపు తెలుంగుమాటలు చేర్చి యొకవిధమైన మాధుర్యగుణమునుగూడ సంతరించవచ్చును. శబ్దగతమైన ప్రౌఢి తెలుగుమాటలతో కావ్యమునందు సమకూర్చుట సాధ్యముకాదు. వాక్యవిన్యాస వైఖరిచేత నర్థమునందు ప్రౌఢి సంపాదించవచ్చును. శబ్దగతమైన ప్రౌఢి పొసగదు. తెలుగులో నొత్తక్షరములు లేవు. జడ్డక్కరములు తక్కువ. కాల్వ, కిన్క, ఇట్టి తెలుగు వ్యాకరణముచేత వచ్చిన శబ్దములు ప్రౌఢిని సమృద్ధిగా పండించలేవు.

మరియు తెలుగుబాస అజంతశబ్ద బహుళమైనభాష. వాగంతహల్లులలోనికి హల్లులు దూరవు. అచ్చు లెక్కువ. క్లిష్టోచ్చారణము కలిగిన శబ్దముల సంఖ్య చాలతక్కువ.

ఇది కాక ధ్వనిప్రపంచకమునందు ననేకములైన యొడుపులు కలవు. కొన్ని అసంలక్ష్యక్రమవ్యంగ్యములు శబ్దము నాశ్రయించియే పుట్టించుటకు వీలగును. అంతశక్తి దేశ్యశబ్దములకు లేదు.

మరియొకటి యేమనగా దేశ్యశబ్దములు దేశజన్యములు. కొన్నివేల యేండ్లక్రింద సంస్కృత ప్రాకృత భాషలయొక్క బహువికారములచేత నీశబ్దము లుత్పన్నములై యుండవచ్చును. దానిప్రకృతులే తెలియవు. అందుచేత వాని వ్యుత్పత్తులు తెలియవు.

కావ్యరచనయందు కొన్నిచోట్ల వ్యుత్పత్త్యర్థముతో గూడిన శబ్దమును ప్రయోగించుటచేత శోభవచ్చును. రూఢ్యర్థమునందు కవి ప్రయోగించును. యోగార్థముచేత నొకధ్వని పుట్టును. భావమునం దొక చమత్కారము జనించును.

కావ్యప్రపంచమున నిట్టి వనంతములైన రామణీయకము లుండును.

ఇట్టివి మరియు నింక నెట్టివి? అనేకములు తెలుగుకావ్యమునందు పొసగించుకొనవలయునన్నచో నన్నయ్యభట్టు తీర్చిన నిర్ణయించిన యాంధ్రభాషయే శరణ్యము.

ఈ చెప్పబోవుదానిని విస్తరించి చెప్పుట కిది యదను గాదు గాని యొక మాటను చెప్పెదను. సంస్కృతకావ్యము సంస్కృతభాషయందు కావ్యమునం దెన్నిసౌందర్యములు నెన్నిరామణీయకములు, శాబ్దికములైనవి యార్థికములైనవి చేయుటకు వీలున్న దని యాలంకారికులు చెప్పిరో వాని నన్నింటిని తెలుగు కావ్యములందు జేయుటకు వీలైన భాషను నన్నయ్యగారు నిర్ణయించిరి. కావ్యమును వ్రాసి చూపించిరి. ఎల్ల లేర్పరచిరి.

ఈవిషయమును విస్తరించి చెప్పినచో కావ్యరచనాశిల్పదృష్టిచేత సర్వభారతమునందు నాంధ్రభాషతో నాంధ్రకావ్యభాషతో పోలెడిది ఇంకొక భాష లేదు. ఉండుటకు వీలులేదు.

ఇది నన్నయ్యగారు మనకు చేసిపెట్టిన మహోపకారము.

పద్యవిద్య యనగా నన్నయ్యగారు దీనిని సర్వమును భావించిరి.

అంబురుహగర్భనిభు డాయన యొక్కడే! విద్యాదయితుడు!!



# విషయసూచిక

## ఆదిపర్వము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

## సప్తమాశ్వాసము

## అష్టమాశ్వాసము

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము-ప్రథమాశ్వాసము

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూ ర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషో త్తమాంబుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే. 1

—:అవతారిక:—

వ. అని సకలభువనరక్షణ ప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి తత్ప్రసాదసమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్యవిభవుండును నిజభుజవిక్రమవిజితారాతిరాజనివహుండును నిఖిలజగజ్జేగీయమాననానాగుణరత్నరత్నాకరుండును నై పరగుచున్న రాజరాజనరేంద్రుండు. 2

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్. 3

క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు గుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిజితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్. 4

చ. ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిం
దన యుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానురం
జన మగు రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మనిబద్ధదయార్ద్రబుద్ధి యై. 5

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్. 6

సీ. నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ
బరమండలంబుల ధరణిపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
బలిమి నీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
వెలుఁగించుచును విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ. జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁ జేయు చిట్లు మనుమార్గుఁ డగు
విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు. 7

వ. అఖిలజలధివేలావలయితవసుమతీవనితావిభూషణంబైన వేంగీదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరతమహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువనలక్ష్మీవిలాసనివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధాన సామంత విలాసినీ పరివృతుఁడయి యపారశబ్దశాస్త్రపారగులైన వైయాకరణులును భారత రామాయణానేకపురాణప్రవీణులైన పౌరాణికులును మృదుమధురరసభావ భాసురనవార్థవచనరచనావిశారదులయిన మహాకవులును వివిధతర్కవిగాహితసమస్తశాస్త్రసాగరగరీయః ప్రతిభులైన తార్కికులును నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలుచుచుండ విద్యావిలాసగోష్ఠీసుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాఁడు. 8

సీ. తన కులబ్రాహ్మణు ననురక్తు నవికృత
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ. 9

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రములతెఱం గెఱింగితి నుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యమునైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్. 10

వ. అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతంబునందుల యభిప్రాయంబు
పెద్దయై యుండు. 11

మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్. 12

వ. మఱి యదియునుంగాక. 19

చ. హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్. 14

చ. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమబహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
ద్యమ సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయచి
త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబ కావునన్.

క. జనసుతకృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

క. బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహుయాగంబులఫలంబు పరమార్థ మిలన్.

వ. అని యానతిచ్చిన విని యక్కవివరుం డిట్లనియె.

చ. అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైన నను నేరఁ బోలునే.

వ. అయినను దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం
నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద నని.

తరలము. హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధికున్ గురుఁ బద్యవిద్యకునాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసుపుత్త్రి భక్తిఁ దలంచుచున్.

ఉ. భారతభారతీశుభగభస్తిచయంబులఁజేసి ఘోరసం
సారవికారసంతమసజాలవిజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుండగు దివ్యుఁ బరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

వ. మఱియును.

చ. పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్. 24

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు తాను ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్. 25

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్. 26

—: భా ర త క థా ప్ర స్తా వ న :—

సం. 1—1—8

వ. తత్కథాప్రారంభం బెట్టి దనిన. 27

సీ. నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ గుల
పతి శౌనకుండను పరమమౌని
బ్రహ్మర్షి గణసముపాసితుండై సర్వ
లోకహితార్థంబు లోకనుతుఁడు
ద్వాదశవార్షికోత్తమసత్రయాగంబు
మొగిఁ జేయుచున్న నమ్మునులకడకు
వచ్చి తా నుగ్రశ్రవసుఁడను సూతుఁడు
రౌమహర్షణి సుపౌరాణికుండు

ఆ. పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్న
నక్కథకువలన మునినికాయ మెల్ల
వివిధపుణ్యకథలు వినువేడ్క నతనిఁ
బూజించి రపరిమితవిశేషవిధుల. 28

వ. అక్కథకుండు వెండియు నమ్మునిసంఘంబునకు నమస్కారంబు చేసి యే
సనేకపురాణపుణ్యకథాకథనదక్షుండ వ్యాసశిష్యుండనైన రోమహర్షణునకుఁ
బుత్త్రుండ నావలన నెక్కథ విన వలతు రనిన నమ్మును లతని కిట్లనిరి: 29

క. ఏయది హృద్య మపూర్వం
బేయది యొద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్, 30

వ. అనిన నుగ్రశ్రవసుం డట్లేని మీకు నభిమతంబైన పుణ్యకథఁ జెప్పెద
దత్తావధానులరై వినుం డని శౌనకాదిమహామునుల కిట్లని చెప్పం దొడంగె.
కృష్ణద్వైపాయనుండను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడ
కున్న ఋగ్యజుస్సామాథర్వణంబులుగా విభాగించి తనశిష్యులయిన పైల
వైశంపాయనసుమంతుజైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రం
బులఁ జేయించి వేదవ్యాసుండై నిజతపోమహత్త్వంబునంజేసి బ్రహ్మచేత
ననుజ్ఞాతుండై యష్టాదశపురాణంబులును నీతిధర్మశాస్త్రార్థతత్త్వంబులును
జతుర్వేదవేదాంతాభిప్రాయంబులును చతుర్వర్గవర్గానుబంధబంధురకథేతి
హాసంబులును జతుర్యుగ మహర్షి రాజవంశచరితంబులును జతుర్వర్ణాశ్రమ
ధర్మక్రమంబులును చతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన
శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాదిభారతవీరులమహాగుణంబును దన
విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడి వెలుంగుచుండ, 31

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు. 32

—: పర్వానుక్రమణిక :—

సం. 1—2—34

వ. అదియునుం బౌష్యంబు పౌలోమం బాస్తీకం బాదివంశావతారంబు సంభవ పర్వంబు జతుగృహదాహంబు హైడింబంబు బకవధ చైత్రరథంబు ద్రౌపదీ స్వయంవరంబు వైవాహికంబు విదురాగమనంబు రాజ్యార్ధలాభం బర్జున తీర్థయాత్ర సుభద్రాకల్యాణంబు హరణహారిక ఖాండవదహనంబు మయ దర్శనంబు సభాపర్వంబు మంత్రపర్వంబు జరాసంధవధ దిగ్విజయంబు రాజసూయం బర్ఘ్యాభిహరణంబు శిశుపాలవధ ద్యూతం బనుద్యూతం బార ణ్యంబు కిమ్మీరవధ కైరాతం బింద్రలోకాభిగమనము ధర్మజతీర్థయాత్ర జటాసురవధ యక్షయుద్ధం బాజగరంబు మార్కండేయోపాఖ్యానంబు సత్యా ద్రౌపదీ సంవాదంబు ఘోషయాత్ర ప్రాయోపవేశంబు వ్రీహిద్రోణకాఖ్యా నంబు ద్రౌపదీహరణంబు కుండలాహరణం బారణేయంబు వైరాటంబు కీచకవధ గోగ్రహణం బభిమన్యువివాహం బుద్యోగంబు సంజయయానంబు ధృతరాష్ట్రప్రజాగరణంబు సానత్సుజాతంబు యానసంధి భగవద్యానంబు సేనానిర్యాత్ర యులూకదూతాభిగమనంబు సమరథాతిరథసంఖ్యానంబు కర్ణ భీష్మవివాదం బంబోపాఖ్యానంబు జంబూఖండ వినిర్మాణంబు భూమి పర్వంబు భీష్మాభిషేకంబు భగవద్గీత భీష్మవధ ద్రోణాభిషేకంబు సంశ ప్తకవధ యభిమన్యువధ ప్రతిజ్ఞాపర్వంబు జయద్రథవధ ఘటోత్కచవధ ద్రోణవధ నారాయణాస్త్ర ప్రయోగంబు కర్ణపర్వంబు శల్యపర్వంబు హ్రద ప్రవేశంబు గదాయుద్ధంబు సారస్వతంబు సౌప్తికపర్వం బైషీకంబు జల ప్రదానంబు స్త్రీపర్వంబు శ్రాద్ధపర్వంబు రాజ్యాభిషేకంబు చార్వాకనిగ్ర హంబు గృహప్రవిభాగంబు శాంతిపర్వంబు రాజధర్మానుకీర్తనం బాపద్ధ ర్మంబు మోక్షధర్మం బానుశాసనికంబు భీష్మస్వర్గారోహణం బాశ్వమేధికం బనుగీత యాశ్రమవాసంబు పుత్త్రసందర్శనంబు నారదాగమనంబు మౌస

